

# వేమన రత్నములు

—*మంచి వస్తువు*—

ఆ. నిక్కమైన మంచి నీల మొక్కటి చాలుఁ
దళుకు బెళుకు రాళ్ళు తట్టెఁడేల
చాటుపద్యమిలను జాలదా యొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ.

టీక. విశ్వదాభిరామ=లోకమునకు ప్రియమైనవాఁడా! వేమ=వేమా, వినర=వినుము: నిక్కమైన=నిజమైన: మంచినీలము=నీలము అను పేరుగల రాయి. ఒక్కటి చాలుఁ=చాలును: తళుకు బెళుకు రాళ్ళు=చూచినంతనే భ్రమింపఁ జేయునట్టి మెఱుపుతో గూడుకొన్న రాళ్ళు: తట్టెడు=గంపెడు, ఏల=ఎందుకు? చాటు పద్యము=రసము, భావము గలిగి విడిగా వ్రాయఁబడు పద్యము: ఇలను=భూమియందు; ఒక్కటి చాలదా=చాలును.

తా. లోకమునకు ప్రియమైన ఓ వేమా! లాభములేని మెఱుపుతో గూడుకొన్న రాళ్ళు తట్టెఁడైనను బనికిరావు. రసభాగములు గలిగిన చాటు పద్య మొక్కటి చాలినట్లే మంచి నీల మొక్కటి చాలును.

ఆ. గంగగోవు పాలు గంటెఁడైనను జాలుఁ
కడివెఁడైన నేల ఖరముపాలు
భక్తి కలుగు కూడు పట్టెఁడేచాలురా విశ్వ. 2

టీక. విశ్వ...వేమ, గంగగోవుపాలు=నల్లని యావుపాలు, గంటెఁడైనను=గరిటెఁడైనను: చాలుఁ=చాలును; కడివెఁడైన = కుండెఁడైన; ఏల=ఎందుకు; ఖరముపాలు=గాడిదెపాలు: భక్తి, కలుగు=ఉన్న: కూడు=అన్నము, పట్టెఁడే=పట్టెఁడైనను; చాలురా=చాలును.

తా. కడివెఁడు గాడిదపాలకంటె నల్లని యావుపాలు గరిటెఁడైనను చాలును. భక్తిగలిగి పెట్టు అన్నము పట్టెఁడేచాలును.

—*చిత్తశుద్ధి*—

ఆ. చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదువకాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత విశ్వ. 3

టీక. విశ్వ...వేమ: చిత్తశుద్ధి = మనస్సులోపలను, కల్మషము లేకుండ నుండి; చేసిన=ఒనర్చిన; పుణ్యము = మంచికార్యము; కొంచెమైనను=స్వల్పమైనను; అదియు=అది: కొదవకాదు = తక్కువకాదు; విత్తనంబు = బీజము; మఱ్ఱివృక్షంబునకు = మఱ్ఱిచెట్టునకు; ఎంత = మిక్కిలి తక్కువనుట.

తా. మనస్సులో కల్మషము లేకుండ చేసిన పుణ్యము కొంచెమైనను తక్కువకాదు. అంతపెద్దమఱ్ఱిచెట్టునకు విత్తన మెంతయుండును?

ఆ. ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా విశ్వ. 4

టీక. విశ్వ...వేమ—ఆత్మశుద్ధి=మనస్సు నిర్మలముగా నుండుట ; లేని=లేకయున్న ; ఆచారము, అది, ఏల=ఎందుకు ; భాండశుద్ధి=కుండ కడుగుకొనుట ; లేని = లేనట్టి ; పాకము=వంట ; ఏల=ఎందుకు ; చిత్తశుద్ధిలేని, శివపూజ=ఈశ్వరునిగొలుచుట, ఏలరా—

తా. మనస్సు సరిగా లేని వట్టి యాచారమెందుకు ? కుండ కడుగుకొనకుండ వంట జేసికొనుట యేమి బాగుండును ? అట్లే చిత్తశుద్ధి లేని శివపూజ యెందుకు ?

—* సజ్జనుఁడు *—

ఆ. మిరెపగింజ చూడ మీఁద నల్లగ నుండు
గొఱికి చూడ లోనఁ జుఱుకు మనును
సజ్జనులగువారి సారమిట్లుండురా విశ్వ. 5

టీక. విశ్వ...వేమ;—మిరెపగింజ, చూడ=చూచిన, మీఁద=పైన నల్లగనుండు ; కొఱికి చూడ=కొఱికి చూచిన, లోన=లోపల ; చుఱుకు మనును=మంటపెట్టును ; సజ్జనులు=మంచి పురుషులు ; అగువారి=అయిన వారి ; సారము=బలము ; ఇట్లుండురా=ఇటులుండును.

తా. మిరెపగింజ చూపులకు చిన్నదిగా నుండి, కొఱికినచో నెట్లు కారముగ నుండునో, యట్లే సజ్జనులు పైకి గనఁబడక యుందురు.

ఆ. మృగమదంబు చూడ మీఁద నల్లగ నుండు
బరఁఘ విల్లు దాని పరిమళంబు
గురువులైన వారి గుణములీలాగురా విశ్వ. 6

టీక. విశ్వ...వేమ ; మృగమదంబు=కస్తూరి ; చూడ=చూడగా ; మీఁద=పైన, నల్లగనుండు = నల్లగా నుండును, దాని = దానియొక్క—

పరిమళంబు = సువాసన, పరిఢవిల్లు = ప్రకాశించును, గురువులైనవారి = సజ్జనులగువారి, గుణములు = గుణములు, ఈలాగురా.

తా. కస్తూరి పైకి నల్లగ నున్నను దాని మంచివాసన యెట్లు ప్రకాశించునో, యట్లే సజ్జనులు గుణములుకూడ నుండును.

— అల్పుఁడు - సజ్జనుఁడు —

ఆ. అల్పుఁ డెపుడుపల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కుఁ జల్లగాను
కంచు పలికినట్లు కనకంబు పల్కునా విశ్వ. 7

టీక. విశ్వ...వేమ; అల్పుఁడు=హీనగుణము కలవాఁడు, ఎపుడు=ఎప్పుడు, ఆడంబరము గాను = బడాయితో, పల్కును = పలుకును, సజ్జనుఁడు=మంచిగుణములుకలవాఁడు, చల్లగాను=శాంతముతో, పల్కున్ = పల్కును. కంచు, పలికినట్లు = మ్రోగినట్లు, కనకంబు = బంగారము, పలుకునా ?

ఆ. నిండునదులు పారు నిలిచి గంభీరమై
వెఱ్ఱివాగు పారు వేగబొర్లి
అల్పుఁడాడురీతి నధికుఁడు నాడునా విశ్వ. 8

టీక. విశ్వ...వేమ; నిండునదులు=బాగుగా జలముతో నిండియున్న నదులు, పారు = ప్రవహించును, నిలిచి, గంభీరమై = గంభీరముగ, వెఱ్ఱివాగు=చిన్న ప్రవాహము, పారు, వేగ=శీఘ్రముగా, పొర్లి, అల్పుఁడు=హీనగుణములు కలవాఁడు, ఆడు రీతి=పలుకు విధమున, అధికుఁడు=గొప్పవాఁడు, ఆడునా ?

తా. చిన్న చిన్న ప్రవాహములు శీఘ్రగతిని పొర్లుచు ప్రవహించును. నిండు నది గంభీరముగా నిలిచియుండును. అట్లే అల్పుఁడు పలికినట్లు అధికుఁడు పలుకఁడు.

ఆ. గంగపాఱు నెపుడుఁ గదలని గతితోఁడ
ముఱికివాగుపాఱు మ్రోతతోఁడ
పెద్ద పిన్న తనము పేరిమి యీలాగు విశ్వ. 9

టీ. విశ్వ...వేమ–గంగ=గంగానది, ఎప్పుడు, కదలని=చలనము లేని, గతితోఁడ=నడకతోఁడ, పాఱు=పాఱును; ముఱికివాగు=ముఱికి వాగు, మ్రోతతోఁడ=చప్పుడుతోఁడ, పాఱు. పెద్ద పిన్నతనము పేరిమి= అల్పులకును, సజ్జనులకుండు భేదము ఇట్లే యుండును.

తా. గంగానది చలనములేకుండ ప్రవహించును. ముఱికివాగు ధ్వని తో ప్రవహించును. పెద్దపిన్నలకు భేద మిట్లేయుండును.

—• ఉత్తముఁడు. •—

ఆ. నేరనన్నవాఁడు నెరజాణ మహిలోన
నేర్తునన్నవాఁడు నిందఁ జెందు
ఊరకున్నవాఁడె యుత్తమయోగిరా విశ్వ. 10

టీ. విశ్వ...వేమ; నేరనన్నవాఁడు=తెలియదని చెప్పువాఁడు; నెఱజాణ=మంచి తెలివిగలవాఁడు; నేర్తునన్నవాఁడు=సర్వము తెలియునని చెప్పువాఁడు; నిందఁజెందు=అపవాదఁబొందును; ఊరకున్నవాఁడె=ఏమి యుఁ దెలియదని చెప్పువాఁడె; ఉత్తమయోగిరా=మంచియోగి.

తా. తెలియదని చెప్పువాఁడే మంచి తెలివిగలవాఁడు. తెలిసినదని చెప్పువాఁడు నిందఁబొందును. యేమియు దెలియదని యూరకున్నవాఁడే యుత్తముఁడు.

.• పిఱికివాఁడు. •.

ఆ. మేడిపండు చూడ మేలిమైయుండును
పొట్టవిచ్చిచూడఁ బురుగులుండు
బిఱికివాని మదిని బింకమీలాగురా విశ్వ. 11

టీ. విశ్వ...వేమ- మేడిపండు-చూడ=చూచిన; మేలిమై యుం డును=బాగుగా నుండును; పొట్ట=కడుపు; విచ్చి=తెఱచి; చూడ, పురు గులుండు=పురుగులుండును; పిఱికివాని=పిఱికివానియొక్క; మదిని=మనస్సు లోపల; బింకము=గట్టితనము; ఈలాగురా.

తా. మేడిపండు పైకి బాగుగానుండి లోపల పురుగులుండినట్లే పిరికివాని మనస్సులో గట్టితనమట్లే యుండును.

## —• గుణము •—

ఆ. పూజకన్న నెంచ బుద్ధి నిదానంబు
మాటకన్న నెంచ మనసు దృఢము
కులముకన్న మిగుల గుణము ప్రధానంబు విశ్వ. 12

టీ. విశ్వ...వేమ, పూజకన్న=పూజకన్న, ఎంచ=ఆలోచించఁగా, బుద్ధి=బుద్ధి, నిదానంబు=మంచిది; మాటకన్న, నెంచ, మనస్సు, దృఢము=గట్టిది; కులముకన్న=జాతికన్న, గుణము; ప్రధానము=ముఖ్యము.

తా. పూజకన్న బుద్ధి నిదానముగా నుండవలెను. మాటకన్న మనస్సు దృఢముగా నుండవలయును. కులముకన్న గుణము ప్రధానమై యుండవలయును.

## —• సద్గుణుఁడు—దుర్గుణుఁడు. •—

ఆ. కులములోన నొకఁడు గుణవంతుఁడుండిన
గులము వెలయువాని గుణముచేత
వెలయ వనములోన మలయజమున్నట్లు విశ్వ. 13

టీ. విశ్వ...వేమ- కులములోన=వంశములోన, ఒకఁడు, గుణ వంతుఁడు=మంచిగుణములుగలవాఁడు; ఉండిన = ఉన్నచో; కులము

వెలయును=ప్రకాశించును; వెలయ=ప్రకాశమానమైన. వనములోన=వనమందు, మలయజము=చందనవృక్షము; ఉన్నట్లు=ఉన్న విధమున.

తా. వనములో చందన వృక్షమున్నట్లు సద్గుణవంతునిచేత కులము ప్రకాశించును.

ఆ. కులములోన నొకఁడు గుణహీనుఁ డుండిన
కులము చెడును వానిగుణమువలన
వెలయుఁ జెఱకునందు వెన్ను వెడలినట్లు విశ్వ. 14

టీ. విశ్వ... వేమ— కులములోన=కులమునందు, గుణహీనుఁడు=దుర్గుణుఁడు; ఉండిన=ఉన్నచో, వాని=వానియొక్క, గుణమువలన=గుణముచేత, కులము, చెడును=నశించును, వెలయు=ఒప్పునట్టి చెఱకునందు, వెన్ను=పూవు, వెడలినట్లు=బయలుదేరినట్లు

తా. చెఱకునందు వెన్ను బయలుదేరినట్లు కులములోన గుణహీనుఁడున్నచో వానిమూలమున గుణము చెడును.

ఆ. ఉత్తముని కడుపున నోగు జన్మించిన
వాఁడె చెఱుచు వాని వంశమెల్ల
జెఱకు వెన్ను పుట్టి చెఱుపదా తీపెల్ల విశ్వ. 15

టీ. విశ్వ... వేమ— ఉత్తముని కడుపున=మంచివాని కడుపున, ఓగు=చెడ్డవాఁడు, జన్మించిన=పుట్టిన, వాఁడే, వాని=వానియొక్క, వంశమెల్ల=కులమెల్ల, చెఱచు, చెఱకు=చెఱకున, వెన్నుపుట్టి=వెన్నుపుట్టి, తీపెల్ల=తీపినెల్ల, చెఱుపదా=చెఱుచును.

తా. చెఱకున వెన్నుబుట్టి తీపినంతయు చెఱుచునట్లు మంచికులమున చెడ్డవాఁడు బుట్టి ఆ కులమును జెఱచును.

ఆ. రాముఁ డొకఁడుపుట్టి రవికులమీడేర్చె
కురుపతిజనియించి కులము జెఱిచె;
ఇలను బుణ్యపాప మీలాగు గాదొకో విశ్వ. 16

టీ. విశ్వ... వేమ—రాముఁడు=రాముఁడనువాఁడు, ఒకఁడు, పుట్టి=, రవికులము=సూర్యకులమును, ఈడేర్చె=వృద్ధిఁబొందించెను. కురుపతి=కౌరవులలో పెద్దవాఁడైన దుర్యోధనుఁడు, జనియించి=పుట్టి కులము జెఱిచె=చెఱచెను, ఇలను=భూమిపై, పుణ్యపాపములు=పుణ్యమును, పాపమును, ఈలాగు=ఈలాగున, కాదొకో=కాదా?

తా. శ్రీరాముడు జనించి రవికులమునకు కీర్తి వెచ్చెను. దుర్యోధనుఁడు జనించి కురుకులమునకు నాశనము గూర్చెను. పుణ్య పాపము లిట్లె యుండును.

—•కుశిస్తుఁడు.•—

ఆ. వేఱుపురుగుజేరి వృక్షంబు జెఱుచును
జీడపురుగుచేరి చెట్టు జెఱుచు,
గుత్సితుంఁడుజేరి గుణవంతు జెఱుచురా విశ్వ. 17

టీ. విశ్వ... వేమ—వేఱుపురుగు=వేరునందు, పురుగు, చేరి వృక్షంబు=చెట్టును, చెఱుచును, జీడపురుగు=జీడపురుగు, చేరి, చెట్టు, చెఱుచు, కుత్సితుండు=దుర్గుణములుకలవాఁడు, చేరి, గుణవంతు=మంచి గుణములుకలవానిని, చెఱుచురా=చెఱుచును.

తా. పురుగు వేరునజేరి వృక్షమును జెఱుచునట్లును, జీడపురుగు పాదను జెఱుచునట్లును, చెడ్డగుణములు గలవాడు సుగుణునిజేరి జెఱుచును.

ఆ. హీనగుణమువాని నిలుసేర నిచ్చిన
ఎంతవానికైన నిడుమ గలుగు;
ఈఁగ కడుపుజొచ్చి యిట్టట్టు సేయదా విశ్వ. 18

టీక. విశ్వ...వేమ-హీన గుణము వాని = హీనగుణము కలవానిని; ఇలు=ఇల్లును: సేరనిచ్చిన = ప్రవేశింపనిచ్చిన; ఎంతవానికైన = ఎటువంటివానికైన; ఇదుమ = బాధ; కలుగు = కలుగును; ఈగ, కడుపుచొచ్చి = కడుపునఁ బ్రవేశించి; ఇట్టట్టు = తలక్రిందుగా; సేయదా= చేయును.

తా. దుర్గుణుని ఇల్లు సేరనిచ్చినచో, నెంతటివానికైనను, ఈగ కడుపులో బ్రవేశించి బాధ కలుగజేయునట్లు బాధ కలుగజేయును.

—* హీనుఁడు *—

ఆ. హీనుఁ డెన్ని విద్య లిలను నేర్చినఁగాని
ఘనుఁడుగాఁడు హీన జనుఁడె గాని
పరిమళములు మోయ గార్ధభము గజమౌనె విశ్వ. 19

టీక. విశ్వ . వేమ-హీనుఁడు; ఎన్ని విద్యలను=ఎన్ని చదువులను; నేర్చినగాని = నేర్చుకొన్నగాని; ఘనుఁడుగాడు = గొప్పవాఁడు కాఁడు; హీనజనుఁడె=హీనుఁడె; కావి, పరిమళములు = సువాసన ద్రవ్యములు, గార్ధభము = గాడిదె; మోయ=మోసినచో; గజమౌనె = ఏనుగౌనా?

తా. హీనుఁ డెన్నివిద్యలు నేర్చినను హీనుఁడే గాని గొప్పవాఁడు గాఁడు. సువాసన ద్రవ్యములు మోసినంతనే గాడిద యేనుఁగు గాదు.

ఆ. విద్య లేనివాఁడు విద్యాధికుల చెంత
నుండినంత బండితుఁడు కాఁడు
కొలని హంసలకడఁ గొక్కెర యున్నట్లు విశ్వ. 20

టీక. విశ్వ...వేమ-విద్యలేనివాఁడు = చదువు లేనివాఁడు; విద్యాధికుల చెంత = చదువుకొన్నవారివద్దను; ఉండినంత = ఉన్నంతనే. పండితుడు కాఁడు, కొలని హంసలకడ = సరస్సులో నుండు హంసలవద్దను; కొక్కెర = కొంగ, యున్నట్లు = యుండినట్లు.

తా. హంసలకడ కొంగయున్న విధమున — చదువులేనివాఁడుచదువుకొన్న వాని దగ్గఱనున్న మాత్రమునఁ బండితుఁడు కాడు.

—• అల్పుఁడు •—

ఆ. అల్పజాతివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల దోలి తిరుగుఁ
జెప్పు దినెడి కుక్క చెఱకు తీపెఱుగునా విశ్వ. 21

టీక విశ్వ...వేమ_అల్పజాతివానికి = నీచకులమువానికి, అధికారము = ఉన్నతమైన పదవిని, ఇచ్చిన = ఇచ్చినచో, దొడ్డవారినెల్ల = మంచివారినందఱిని తోలి = వెళ్ళగొట్టి తిరుగున్ = తిరుగును, చెప్పు దినెడి కుక్క = చెప్పులను నములుకుక్క, చెఱకు = చెఱకుయొక్క తీపి = తియ్యదనమును, ఎఱుగునా = ఎఱుఁగదు.

తా. అల్పునకు అధికారమిచ్చినచో మంచివారిని వెళ్ళగొట్టును. చెప్పులదిను కుక్క చెఱకుతీపి యేమి యెఱుగును.

ఆ. అల్పుడైన వాని కధికభాగ్యము గల్గ
దొడ్డవారిఁ దిట్ట దోలఁగొట్టుఁ
అల్పజాతి మొప్పె యధికుల నెఱుఁగునా విశ్వ. 22

టీక. విశ్వ...వేమ_అల్పుఁడైనవానికి = అల్పునకు, అధిక భాగ్యము = ఎక్కువభాగ్యము, కల్గ = కలిగిన, దొడ్డవారిన్ = మంచివారిని, దిట్టి = దూషించి తోలఁగొట్టు = వెడలఁగొట్టును, అల్పజాతి = నీచకులమునందుఁ బుట్టిన, మొప్పె = మూర్ఖుడు. అధికుల = గొప్పవారిని, ఎఱుఁగునా = ఎఱుఁగడు.

తా. అల్పునకు భాగ్యముకలిగినచో మంచివారిని దిట్టి వెడలగొట్టును. నీచకులమునఁబుట్టిన మూర్ఖుడు అధికుల నెఱుగఁజాలడు.

ఆ. ఎద్దుకైనఁగాని యేడాది తెల్పిన
మాట దెలిసి నడచు మర్మ మెఱిఁగి
మొప్పె తెలియలేదు ముప్పదేండ్లకునైన విశ్వ. 28

టీక. విశ్వ...వేమ-ఎద్దుకైనగాని = ఎద్దునకైనను, ఏడాది = ఒక సంవత్సరము, తెల్పిన = తెలిపినచో, మాటదెలిసి = మాటలు గ్రహించి, నడచు = నడచును, మర్మమెఱిఁగి = రహస్యము కనుగొని, మొప్పె = మూఢుఁడు, ముప్పదేండ్లకునైన = ముప్పది సంవత్సరముల కయినను తెలియలేదు = ఎఱుఁగలేదు.

తా. ఎద్దునకైనను యొక సంవత్సరము తెలిపినచో మాటలు గ్రహించి యతినడుచునుగాని, మూఢుఁడు ముప్పదేండ్లకైన నేర్వలేడు.

ఆ. ఎలుకతోలు దెచ్చి యేడాది యుతికిన
నలుపు నలుపేగాని తెలుపురాదు
కొయ్యబొమ్మ దెచ్చి కొట్టిన బలుకదు విశ్వ. 24

టీక. విశ్వ...వేమ - ఎలుకతోలు = ఎలుకయొక్క చర్మమును, తెచ్చి, ఏడాది = ఒక సంవత్సరము, ఉతికిన = ఉతికినను, నలుపు.నలుపే గాని, తెలుపుగాదు = తెలుపుబడదు కొయ్యబొమ్మను = కొయ్యబొమ్మను తెచ్చి = తీసికొనివచ్చి, కొట్టిన = కొట్టినచో, పలుకదు = మాటలాడదు.

తా. కొయ్యబొమ్మను దెచ్చి కొట్టినచో పలుకని విధమున, ఎలుక చర్మము ఒక సంవత్సర మూతికినను తెల్లబడదు.

—• ఖలుఁడు. •—

ఆ. పాముకన్న లేదు పాపిష్ఠిజీవంబు
అట్టిపాము చెప్పినట్టు వినును
ఖలునిగుణముమాన్ప ఘనులెవ్వరును లేరు విశ్వ. 25

టీక. విశ్వ...వేమ-పాముకన్న = సర్పముకంటె, లేదు, పాపిష్టి= పాపము జేసుకొనిన, జీవంబు = జంతువు, అట్టి పాము = అటువంటి పాము, చెప్పినట్టె = చెప్పిన ప్రకారమే, వినును, ఖలుని = నీచునియొక్క గుణము = బుద్ధి, మాన్ప = మాన్పదగిన, గొప్పవారు. ఎవ్వరునులేరు.
తా. పాపపు జంతువైన పాము, చెప్పినట్లు వినునుగాని. ఖలుని గుణము మాత్ర మెవ్వరును మాన్పఁజాలరు.

ఆ. వేముపాలువోసి ప్రేమతోఁ బెంచిన
చేఁదు విడిగి తీపు చెందబోదు,
ఓగు నోగెఁగాక యుచితజ్ఞుఁ డెటులౌను విశ్వ. 26

టీక. విశ్వ...వేము- వేపచెట్టు, పాలువోసి = పాలనుబోసి, ప్రేమతో = ప్రీతితో, పెంచిన = పెంచినను, చేదు = చేదుగనము, విడిగి = పోయి, తీపు = తీపితనము. చెందబోదు, ఓగు = చెడ్డవాఁడు, ఓగెఁగాక = చెడ్డవాఁడె. యుచితజ్ఞుఁడు = తెలివికలవాఁడు. ఎటులౌను = ఎట్టులౌను.
తా. పాలువోసి పెంచినను వేపచెట్టు తన చేదును విడువనట్లు చెడ్డవాఁడు చెడ్డవాఁడే యగును గాని మంచివాఁడెట్లగును ?

ఆ. పాలుపంచదార పాపరపండ్లలో
జాలఁబోసివండఁ జవికిరాదు
కుటిల మానవులకు గుణమేల గల్గురా విశ్వ. 27

టీక. విశ్వ... వేము, పాలు, పంచదార, పాపరపండ్లలో =(అవి యొక విధమైన చేదుపండ్లలో) చాలన్ = ఎక్కువగా, పోసి,వండఁగ=వండినను, జవికిరాదు=రుచికలుగదు, కుటిలమానవులకు = ఖలునకు,గుణమేల= గుణమెట్లు, కలుగురా = కలుగును.
తా. చేదుపండ్లలో పాలు పంచదార పోసి వండినను రుచి కలుగనటు కుటిలునకు మంచిగుణము రాదు.

ఆ. ముష్టి వేపచెట్లు మొదలంట ప్రజలకు
బరగ మూలికలకుఁ బనికివచ్చు
నిర్దయాత్మకుండు నీచుఁడెందునకాను విశ్వ. 28

టీక. విశ్వ...వేమ-ముష్టి = ముష్టిచెట్టును, వేపచెట్టు=వేపచెట్టును మొదలంట = మొదటివరకును, ప్రజలకు = జనులకు. పరగ = ఒప్పఁగా మూలికలకు = ఔషధములకు, పనికివచ్చు = ఉపయోగపడును, నిర్దయాత్మకుండు = దయలేనివాఁడు, నీచుడు = నీచగుణము కలవాఁడు, ఎందునకాను = ఎందులకు బనికివచ్చును.

తా. ముష్టియు వేపయు మూలికలకు పనికివచ్చునుగాని నీచుఁడెందుకు బనికిరాడు.

ఆ. కానివానితోడఁ గలిసి మెలఁగుచున్నఁ
గాని వానిగాదె కాంతురవని
తాటిక్రిందఁ బాలు త్రాగిన చందమౌ విశ్వ. 29

టీక. విశ్వ...వేమ-కాని వానితోడ = గౌరవము లేనివానితోడ, కలసి, మెలఁగుచున్న = తిరుగుచున్న, కానివానిగానె = గౌరవము లేనివానిగనే. కాంతురు = చూతురు, అవని = భూమిని, తాటిక్రింద = తాటిచెట్టుక్రింద, పాలు. త్రాగిన చందమౌ = త్రాగినట్లగును

తా. చెడ్డవానితోఁగలిసి తిరుగుచున్నచోఁ దాటిచెట్టుక్రిందపాలు త్రాగినట్లే యగును.

—• నిలువదగనిచోటు. •—

ఆ. పాల నీడిగింట గ్రోలుచునుండెనా
మనుజులెల్ల గూడి మద్యమందు
నిలువఁదగనిచోట నిలువ నిందలువచ్చు విశ్వ. 30

టీక. విశ్వ...వేమ-పాలక = పాలను, ఈడిగింట = ఈడిగింటిలో (కల్లుఅమ్మువారి కులము) గ్రోలుచుండెనా = త్రాగుచున్నచో, మనుజులు = మనుష్యులు, ఎల్ల = అందఱు, కూడి = ఏకమై, మద్యమంద్రు= త్రాగుడందురు. నిలువఁదగని = నిలువకూడని, చోట = స్థలమున, నిలువ= నిలుచున్నచో, నిందలు = అపవాదలు, వచ్చు = వచ్చును.

తా. ఈడిగింట పాలు త్రాగినను లోకులు దానిని మద్యమే యందురు. అందుచే ఉండగూడని స్థలమున నున్నచో నిందవచ్చును.

## — తా మ స ము —

ఆ తామసించి చేయఁదగదెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమగును
పచ్చికాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె విశ్వ. 31

టీక విశ్వ...వేమ-తామసించి = కోపించి, చేయఁదగదు = చేయకూడదు, ఎట్టికార్యంబు = ఏకార్యమైనను; వేగిరింప = తొందరపడినచో; అదియు = అదికూడ; విషమగును = వ్యతిరేక మగును: పచ్చికాయ, తెచ్చి పడవేయ = పండవేసిన యెడల; ఫలమౌనె = ఫలమగునా?

తా. ఏకార్యమైనను గోపముచేతగాని తొందరపడిగాని చేసినచో నది చెడును. పచ్చికాయను పండవేసినచో ఫలమగునా ?

## — కో ప ము —

ఆ. కోపమునను ఘనత కొంచమైపోవును
కోపమునను మిగుల గోడుగలుగు
కోపముడఁచెనేని కోర్కెలు సిద్ధించు విశ్వ 32

టీక. విశ్వ...వేమ-కోపమునను = కోపముచేత, ఘనత = గొప్పతన, కొంచెమైపోవును = తగ్గిపోవును; కోపమునను = కోపముచేత, మిగు

ల = మిక్కిలి, గోడు = అల్లరి, కలుగు = కలుగును, కోపము = కోపము ను, అడచవేని = అడచినచో, కోర్కులు, ఈడేరు = సమకూడును.

తా. కోపమువలన గొప్పతనముపోవును, దానిచేత అల్లరి కలుగును. అది అడచుకొన్నచో, నన్నికోర్కులు తీరును.

స్థానబలిమి.

ఆ. నీళ్ళమీఁద నోడ నిగిడి తిన్నగఁ బ్రాకు
బైట మూరెఁడైన బారలేదు
నెలవుదప్పుచోట నేర్పరి కొఱగాఁడు విశ్వ. 33

టీక. విశ్వ... వేమ-నీళ్ళమీఁద = నీటిపైని, ఓడ = ఓడ, నిగిడి తిన్నగ, సరిగా, ప్రాకుఁ = ప్రాకును, బైట = ఈవల, మూరెఁడైన, పాఱలేదు = పోలేదు, నెలవు = తన స్థలము, తప్పుచోట, నేర్పరి = తెలిసినవాఁడైనను, కొఱగాఁడు = పనికిరాడు

తా. ఓడ నీటిమీఁద చక్కఁగ నడచును ఈవల మూరెఁడైనను పోలేదు. అట్లే తన నెలవు తప్పినచో బుద్ధిమంతుఁడైనను పనికిరాడు.

ఆ. నీళ్ళలోన మీను నిగిడి దూరముపారు
బైట మూరెఁడైన పారలేదు
స్థానబలిమిగాని తన బలిమి కాదయా విశ్వ. 34

టీక. విశ్వ...వేమ-నీళ్ళలోన = నీటియందు, మీను = చేప, నిగిడి-దూరము, పాఱు = పోవును, బైట = ఈవల, మూరెఁడైన, పారలేదు = పోలేదు, స్థానబలిమి = తానున్న స్థలముయొక్క బలము, కాని, తనబలిమి = తనయొక్క బలము, కాదయా = కాదు.

తా. నీటిలో చేప యెంత దూరమైనను పోవును. ఈవల మూరెఁడైనను పోలేదు స్థానబలిమియే కాని తన బలిమి కాదు.

ఆ. నీళ్ళలోన మొసలి నిగిడి యేనుఁగుఁదీయు
బైటఁ గుక్కచేత భంగపడును
స్థానబలిమిగాని తనబలిమి కాదయా విశ్వ. 35

టీక. విశ్వ...వేమ-నీళ్ళలోన = నీటియందు, మొసలి, నిగిడి యేనుగుఁ = ఏనుగును, తీయు = లాగును, బైట, కుక్కచేత, భంగపడును. స్థానబలిమి = తానున్న స్థలబలము, కాని, తన బలిమి = తనబలము, కాదయా = లేదు.

తా. నీటిలో నున్నంతవఱకు మొసలి యేనుగును లాఁగఁగలదు. ఈవలకు వచ్చెనేని కుక్కచేత భంగమొందును. స్థానబలిమియే కాని తన బలిమికాదు.

## కలిమి

ఆ. కులము లేనివాఁడు కలిమిచే వెలయును
కలిమిలేనివాఁడు కులము దిగును
కులముకన్న భువిని కలిమి యెక్కువసుమీ విశ్వ. 36

టీక. విశ్వ...వేమ-కులములేనివాఁడు = కులముతక్కువవాఁడు, కలిమిచే = భాగ్యముచేత, వెలయును = ఒప్పును, కలిమిలేనివాఁడు = భాగ్యములేని వాఁడు, కులము దిగును, కులముకన్న, భువిని = భూమిని, కలిమి = భాగ్యము ఎక్కువసుమీ.

తా. కులహీనుఁడు భాగ్యముచేత నొప్పును భాగ్యహీనునకు గుల ముండును. కులముకన్న సంపదయే యెక్కువ.

ఆ. కులము గలుగువాఁడు గోత్రంబు గలవాఁడు
విద్యచేత విఱ్ఱవీఁగువాఁడు
పసిఁడిగల్గువాని బానిస కొడుకులు విశ్వ. 37

టీక. విశ్వ...వేమ-కులముగలుగువాఁడు = మంచికులముగలవాఁడు, గోత్రంబుగలవాఁడు = మంచిగోత్రము కలవాఁడు, విద్యచేత = చదువుచేత, విఱ్ఱవీగువాఁడు = గర్వించువాఁడు, పసిఁడి = బంగారము, గల్గువాని = ఉన్నవాని, బానిసకొడుకులు = దాసీపుత్రులు.

తా. మంచికులగోత్రములుగలవాఁడును, విద్యగలవాఁడును, ద్రవ్యవంతునకు దాసీపుత్రులని తలంపఁబడుదురు.

ఆ. కనియు గానలేఁడు కదలింపఁడానోరు
వినియు వినఁగలేఁడు విస్మయమున
సంపద గలవాని సన్నిపాతంబిది విశ్వ. 40

టీక. విశ్వ...వేమ-కనియు = చూచియు; కానలేఁడు = చూడలేఁడు కదలింపఁడు = కదపఁడు; ఆనోరు = నోటిని; వినియు వినఁగలేఁడు-విస్మయమున = ఆశ్చర్యమున; సంపదగలవాని = ద్రవ్యవంతుని; సన్నిపాతం[illegible] = సన్నిపాతగుణము, ఇది.

తా. చూడకపోవుటయు; మాట వినిపించుకొనకపోవుటయు కలిమిగలవానికున్న సన్నిపాతగుణములు

—• లోభి •—

ఆ. గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ గొంపోయిన
పాలనీక తన్నుఁ బండ్లురాల
లోభివాని నడుగ లాభంబు లేదయా విశ్వ. 41

టీక. విశ్వ...వేమ-గొడ్డుటావును = గొడ్డావును, పిదుకఁగా = పిదుకుటకు; కుండ; కొంపోయిన = తీసికొనివెళ్ళిన: పాలనీక = పాలీయక; తన్నుఁగా = తన్నును; పండ్లురాల = [illegible]; లోభివాని = లోభివానిని; అడుగ = అడిగినందువలన; లాభంబు = సార్థకము, లేదయా = లేదు.

తా. గొడ్డుటావును బితుకుటకు గుండ తీసుకొని వెళ్ళినను పాలీయక యున్నట్లు లోభిని యాచించినచోఁ బ్రయోజనము లేదు.

ఆ. మేఁక కుతికఁబట్టి మెడచన్ను గుడువఁగా
ఆఁక లేలమాను నాశగాక
లోభివాని నడుగ లాభంబు లేదయా విశ్వ. 42

టీక. విశ్వ...వేమ-మేక = మేకయొక్క, కుతిక = గొంతుక, పట్టి = పట్టుకొని, మెడచన్ను = మెడచన్నును, కుడువఁగా = కుడిచినచో, ఆకలి ఏలమాను, ఆశ గాక = ఇట్టియాశయే గాని, లోభివాని, అడుగ, లాభంబు, లేదయా.

తా. మేక మెడచన్ను బట్టుకొని కుడిచిన నాకలి తీరనట్లు లోభి వాని నడిగినందువలన ప్రయోజనము లేదు.

ఆ. ఏమి కొంచు వచ్చె నేమి తాఁ గొనిపోవు
బుట్టువేళ నరుఁడు గిట్టువేళ
ధనము లెచటి కేగుఁ దానెచ్చటికి నేగు విశ్వ. 43

టీక. విశ్వ...వేమ-ఏమి=దేనిని, కొంచు = తీసికొని, వచ్చె = వచ్చెను, ఏమి-తాఁ = తాను కొనిపోవు = తీసికొనిపోవును. పుట్టువేళ = పుట్టునప్పుడు, నరుఁడు = మానవుఁడు, గిట్టువేళ = చచ్చువేళ, ధనములు = సంపదలు, ఎచటికి = ఎక్కడికి, ఏగు = ఏగును, తాఁ = తాను. ఎచ్చటికి-ఏగు

తా. మానవుఁడు పుట్టినప్పు డేమి తీసుకొనివచ్చును. చచ్చునప్పు డేమి తీసికొని పోవును. ఈసంపద లెక్కడికి పోవును. తా నెక్కడికి బోవును.

ఆ. తనువ దెవరిసొమ్ము తనదని పోషింప
ద్రవ్య మెవరిసొమ్ము దాచుకొనఁగ
బ్రాణ మెవరిసొమ్ము పారిపోకను నిల్ప విశ్వ. 44

టీక. విశ్వ...వేమ- తనువు = శరీరము, ఎవరిసొమ్ము = ఎవరియొక్క ధనము, తనదని = తనదియని, పోషింప = పోషించుటకు, ద్రవ్యము = ధనము, ఎవరిసొమ్ము, దాచుకోనగ = దాచుకొనుటకు, ప్రాణము = జీవము, ఎవరిసొమ్ము, పాణిపోకను = మనలను విడిచిపోకుండ, నిల్వ = నిల్చుటకు.

తా. ఈ శరీరమెవరి సొమ్ము ఈద్రవ్య మెవరిది. ప్రాణము పోకుండ నిల్చుట కెవ్వరి సొమ్ము.

ఆ. పెట్టిపోయలేని వట్టి నరులు భూమి
బుట్టనేమి వారు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా విశ్వ. 45

టీక. విశ్వ...వేమ- పెట్టిపోయ్యలేని = దానము సేయని, వట్టినరులు = ప్రయోజనములేని మానవులు, పుట్టనేమి = పుట్టిననేమి, వారు గిట్టనేమి = చచ్చిననేమి, పుట్టలోన = పుట్టయందు, చెదలు = చెదపురుగులు, పుట్టవా, గిట్టవా = చావవా

తా. దానము సేయని వట్టినరులు పుట్టిననేమి గిట్టిననేమి పుట్టలలోఁ జెదపురుగులు పుట్టుటలే

## —• అన్నదానము. •—

ఆ. అన్ని దానములను నన్నదానమె గొప్ప
కన్నతల్లి కంటె ఘనములేదు;
ఎన్న గురునికన్న నెక్కుడు లేదయా విశ్వ. 46

టీక. విశ్వ...వేమ- అన్నిదానములను = అన్నిదానములలోను, అన్నదానమెగొప్ప = శ్రేష్ఠము, కన్నతల్లికంటె, ఘనములేదు = గొప్పదిలేదు, ఎన్న = ఎన్నఁగా, గురునికన్న = గురునికంటె, నెక్కువ లేదయా = ఎక్కువలేదు.

తా. అన్నిదానములలోను అన్నదానము శ్రేష్ఠము కన్నతల్లికంటెను, గురునికంటెను నెక్కువ యేమియు లేదు.

## —॥ ఆశ ॥—

ఆ. ఆశచేత మనుజు లాయువు గలనాళ్ళు
తిరుగుచుందురు భ్రమ ద్రిప్పలేక
ముఱికి భాండమందు ముసురు నీగల భంగి విశ్వ. 46

టీక. విశ్వ...వేమ, ఆశచేత = ఆశవలన, మనుజులు = మనుష్యులు, ఆయువు = ఆయుర్దాయము, కలనాళ్లు = ఉన్నంతవరకు, భ్రమ = కోరిక త్రిప్పలేక = విడువలేక, ముఱికి = మురుగ్గానవగల, భాండమందు = కుండయందు, ముసురు = కూడు, ఈఁగల, భంగి = వలెను, తిరుగుచుందురు.

తా. మానవులు భ్రమ త్రిప్పలేక ఆయువు యున్నన్నాళ్లు ముఱికి కుండలో ముసరు ఈగలట్లు తిరుగుచుందురు.

ఆ. నీళ్ళలోని మీను నెత్తి మాంసమాశించి
గాలమందు జిక్కుకరణి భువిని
ఆశదగిలి నరుఁడు నాలాగె చెడిపోవు విశ్వ. 48

టీక. విశ్వ...వేమ, నీళ్ళలోని = నీటియందుండు, మీను = చేప, నెత్తి, మాంసము, ఆశించి = కోరి, గాలమందు = గాలమున, చిక్కుకరణి = చిక్కుకొను విధమున, భువిని = భూమియందు, ఆశ = ఆశయందు తగిలి = తగుల్కొని, నరుఁడు, ఆలాగ = అట్లె, చెడిపోవు = నశించును.

తా. నీటియందున్న చేప మాంసమున కాశించి గాలమునను జిక్కుకొనునట్లు, మానవు డాశయందు దగుల్కొని చెడిపోవును.

ఆ. ఆస పాపజాతి యన్నిటికంటెను
ఆసచేత యతులు మోసపోరి
చూచి విడచువారు శుద్ధాత్ములైన విశ్వ. 49

టీక. విశ్వ...వేమ, ఆస = ఆశ, పాపజాతి = పాపపుపుట్టుకలేనిది. అన్నిటికంటెను, ఆశచేత = ఆయాసచేత యతులు = యోగులు, మోస

పోరె = మోసపోలేదా, చూచి = చూచి, విడుచువారు = వదలువారు, శుద్ధాత్ములు = మంచి మనస్సుగలవారు.

తా. అన్నిటియందును ఆస మిగుల పాపముగలది, దానిచేత యోగులు గూడ మోసపోయినారు. కావున దానిని తెలిసి విడుచువారు మంచివారు.

ఆ. ఆశ కోసివేసి యనలంబు చల్లార్చి
గోచి బిగియుగట్టి గుట్టు దెలిసి
నిలిచినట్టివాఁడె నెఱయోగి యెంతైన విశ్వ. 50

టీక. విశ్వ...వేమ- ఆశ = ఆశను, కోసివేసి...అనలంబు = అగ్నిని, (ఆశయను నగ్నిని) చల్లార్చి = చల్లార్చి, గోచి బిగయుగట్టి = గట్టిగా గట్టుకొని, గుట్టు తెలసి = ఈజన్మముయొక్క రహస్యము తెలిసి, నిలిచినట్టివాడె = ఉన్నవాడే, ఎంతైన = ఎక్కుడైన, నెఱయోగి, యతీశ్వరుఁడు.

తా. ఆసయను నగ్నిని చల్లార్చి, గోచి బిగించి. మానవ రహస్యమును తెలిసికొనినవాఁడే యోగి

ఆ చచ్చిపడిన పశువు చర్మంబుకండలు
పట్టి పెఱికి తినును బరగ గ్రద్ద
గ్రద్ద వంటివాఁడు గజపతి కాడొకో విశ్వ. 51

టీక. విశ్వ...వేమ- చచ్చిపడిన = చచ్చిపోయిన, పశువు = పశువు యొక్క, చర్మంబు = చర్మము కండలు, పట్టి. పెఱికి = లాగి, తినును = భుజించును, పరగ = ఒప్పుగ, గ్రద్ద. గ్రద్దవంటివాఁడు = గ్రద్ద వంటివాఁడు, గజపతి = ధనమున్నవాఁడు, కాడొకో = కాదా

తా. ధనముకలిగి యాసకలవాఁడు చచ్చిన పశువుల కండలు పీకి తిను గ్రద్దవంటివాఁడు

ఆ. కనక మృగము భువిని గద్దు లేదనకను

దరుణి విడిచి చనియె దాశరథియు
దెలివిలేనివాఁడు దేవుఁ డెట్లాయెరా విశ్వ 52

టీక. విశ్వ... వేమ- కనకమృగము=బంగారపు లేడి, భువిని=భూమిలో, కద్దు = కలదు, లేదు, అనకను = ఆలోచించకుండ, తరుణిని = భార్యను విడిచి = వదలి, చనియె = వెళ్ళెను, దాశరథి = రాముడు, తెలివి లేని వాఁడు = యోచనలేనివాఁడు, దేవుఁడెట్లాయెరా = దైవ మెట్లయ్యెను,

తా. బంగారపు లేడి ఉన్నదా లేదా యని ఆలోచించకుండా రాముఁడు భార్యను విడిచి వెళ్ళెను ఇతడు దైవ మెట్లయ్యెను ?

— భోగ భాగ్యము. —

ఆ. అలను బుగ్గ పుట్టినప్పుడే క్షయమౌను
కలను గాంచు లక్ష్మిఁ గనుటలేదు
ఇలను భోగ భాగ్య మీతీరుగాదొకో విశ్వ. 53

టీక. విశ్వ... వేమ- అలను = అలయందు, బుగ్గ = బుడగ, పుట్టిన ప్పుడే = కలిగిన వెంటనే, క్షయమౌను = నశించును, కలను = కలలో, గాంచు = చూచెడి లక్ష్మి = సంపద, కనుటలేదు = అనుభవించుటలేదు, ఇలను = భూమిని, భోగ్యభాగ్యము భోగము = సంపద, ఈతీరు కాదొ కో = ఇట్లుకాదా.

తా. భోగ్యభాగ్యములు అలలయందు బుట్టినప్పుడే నశించు బుడ గల వంటివి

ఆ. కోతి నొనరదెచ్చి కొత్తపట్టము గట్టి
కొండముచ్చు లెల్ల గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు విశ్వ. 54

టీక. విశ్వ... వేమ- కోతి = కోతిని. ఒనర = ఒప్పుగా, తెచ్చి, కొత్త = నూతనమైన, పట్టముగట్టి = రాజ్యాభిషేకముజేసి, కొండముచ్చులు=

కొండముచ్చులు, ఎల్ల = అన్నియు, గొలిచినట్లు = సేవించినట్లు, నీతిహీనునొద్ద = జ్ఞానములేనివాని యొద్ద, నిర్భాగ్యులు=నిర్భాగ్యులు, ఉండుట.

తా. జ్ఞానహీనుల యొద్ద నిర్భాగ్యులుండుట, కోతికి బట్టముగట్టి కొండముచ్చులు గొలిచినట్లే.

ఆ కల్లలాడు వాని గ్రామకర్త యెఱుంగు
సత్యమాడువాని స్వామి యెఱుఁగు
బెక్కు తిండిపోతుఁ బెండ్లా మెఱుంగురా విశ్వ. 55

టీక. విశ్వ...వేమ-కల్లలాడువాని = అబద్ధము చెప్పువానిని, గ్రామకర్త = గ్రామాధికారి, ఎఱుఁగు = ఎఱుగును. సత్యమాడువానిని=నిజము బల్కువానిని, స్వామి = భగవంతుఁడు, ఎఱుగును బెక్కు = అనేకములు, తిండిపోతు = తినువానిని, పెండ్లాము ఎఱుఁగు = ఎఱుఁగును.

తా. కల్లలాడువానిని, గ్రామాధికారి యెఱుఁగును. నిజము బల్కువానిని దైవమెఱుగును, తన తిండి భార్యయెఱుఁగును.

ఆ. కల్ల నిజములెల్ల గరకంఠుఁ డెఱుఁగును
నీరు పల్లమెఱుఁగు నిజముగాను
దల్లి తానెఱుఁగును దనయుని జన్మంబు విశ్వ. 56

టీక. విశ్వ...వేమ- కల్లనిజములు = అబద్ధములు. నిజములు, ఎల్ల= అన్నియు, గరకంఠుఁడు = ఈశ్వరుఁడు, ఎఱుఁగును, నీరు = జలము, పల్లమెఱుఁగును = పల్లము నెఱుఁగును, నిజముగాను, తల్లి తాను = తాను, ఎఱుఁగని, తనయుని = కుమారుని, జన్మంబు = పుట్టుక.

తా. నిజానిజములు ఈశ్వరునకుఁ దెలియును నీరుపల్లము నెఱుఁగును, తన కుమారుని పుట్టుక తల్లికిఁ దెలియును

ఆ. మొలకోకతోడ మాసిన తలతోడ
ఒడలు మాఱికితోడ నుండెనేని
అగ్రకులజుడైన నట్టిట్టు పిల్వరు విశ్వ. 57

టీక. విశ్వ...వేమ- మైలకోకతోడ = శుభ్రము గాలేని వస్త్రము తోడ, మాసిన తలతోడ = మాసిన శిరస్సుతోడ; ఒడలు = శరీరము,మురికితోడ, నుండెనేని = ఉన్నచో, అగ్రకులజుండైన = ఎక్కువకులములో బుట్టినవాఁడైన, ఆట్టిట్టు = ఎక్కువ గౌరవముగా, పిలువరు.

తా. మైలవస్త్రములతోడను, మాసిన తలతోడను. ముఱికిమెుడలు తోడను గనుపించినచో మంచికులముగలవాని నైనను గౌరవముగఁజూడరు

ఆ. చెట్టుపాలు జనులు చేదందు రిలలోన
ఎనుపగొడ్డు పాలదెంతహితవు
పదుగురాడుమాట పాటింప నిజమయా విశ్వ. 58

టీక. విశ్వ...వేమ- చెట్టుపాలు=చెట్టుయొక్క పాలు,చేదు=చేదని అందురు, యిలలోన = భూమియందు, ఎనుపగొడ్డు = గేదె, పాలు, అదెంత = అదియేమి, హితవు = ఇష్టము, పదుగురు = పదిమంది, ఆడుమాట,పాటింప = పాటిచేయుట, నిజమయా = నిజమౌను.

తా. చెట్టుపాలు చేదందురు. గేదెపాలు తీపియందురు పదిమంది మాటయే పాటిసేయుట నిజము.

ఆ. ఉప్పులేనికూర యొూనంబు రుచులకుఁ;
బప్పులేనితిండి ఫలములేదు;
అప్పులేనివాఁడె యధిక సంపన్నుఁడు విశ్వ. 59

టీక. విశ్వ...వేమ, ఉప్పులేని, కూర, యొూనంబు = హీనము రుచులకు, పప్పులేని, తిండి, ఫలములేదు, = సార్థకములేదు, అప్పులేనివాడే, అధికసంపన్నుఁడు = ఎక్కువ భాగ్యశాలి.

ఆ. పట్టుపట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియఁ బట్టవలయుఁ
బట్టువిడుటకన్నఁ బరగఁ జచ్చుట మేలు విశ్వ. 60

టీ. విశ్వ...వేమ-పట్టు=ఏదియైనను పని చేయవలయునను దీక్ష, పట్టరాదు=వహింపరాదు, పట్టి= అట్టి దీక్షను వహించి, విడువరాదు= వదలరాదు, పట్టెనేని=వహించినచో, బిగియ=గట్టిగా. పట్టవలయును= వహింపవలయు, పట్టి=వహించి, విడుటకన్న= విడుచుటకన్న. పరగ= ఒప్పగా, చచ్చుట-మేలు=మంచిది.

తా. ఏదియైనను కార్యము చేయవలసి వచ్చినప్పుడు ముందు పట్టు వల వహింపరాదు. వహించినపిదప వదలరాదు. దీక్షవహించి వదలుటకన్న చచ్చుట మంచిది.

ఆ. అనఁగననఁగ రాగ మతిశయిల్లుచునుండు
తినఁగ తినఁగ వేము తీపిగలుగు
సాధనమునఁ బనులు సమకూరు ధరలోన విశ్వ. 61

టీ. విశ్వ...వేమ-అనగననఁగ=అనగాఅనగా. రాగము, అతిశయిల్లుచునుండు=వృద్ధిబొందుచుండు, తినగ తినఁగా=తినఁగా తినగా, వేము=వేప, తీపు=తియ్యదనము, కలుగును, సాధనమున= ప్రయత్నముచే పనులు=కార్యములు, ధరలోన = భూమిలోన, సమకూరు = కొనసాగును.

తా. అనఁగా అనఁగా రాగము బయలుదేరును. తినఁగా తినఁగా వేప తియ్యగాయుండును. ఏకార్యమైనను ప్రయత్నముమీద కొనసాగును

ఆ. తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్విజనులకెల్ల నుండుఁ దప్పు
తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు విశ్వ. 62

టీ. విశ్వ... వేమ-తప్పులు-దోషములు, ఎన్నువారు = లెక్కపెట్టువారు, తండోపతండంబులు=అనేకమంది, ఉర్వి=భూమిని, జనులకెల్ల=అందరికిని, ఉండుగా = ఉండును, తప్పు=తప్పులు, ఎన్నువారు=లెక్కపెట్టువారు, తమతప్పు, తమతప్పు=ఎఱుఁగరు.

తా. తప్పుల నెన్నువా రనేకులుందురు. ప్రతివానికిని దప్పుండును ఇతరుల తప్పుల నెన్నువారు తమతప్పు లెఱుఁగరు

ఆ. తనకుఁగల్గు పెక్కు తప్పులుండఁగా
ఓగు నేరమెంచు నొరులఁగాంచి
చక్కిలంబుఁగాంచి జంతిక నగినట్లు విశ్వ. 63

టీ. విశ్వ... వేమ-తనకు = తనకు, కల్గు=ఉన్న, పెక్కు = ఎక్కువ, తప్పులు, ఉండఁగా=కలుగఁగా ఓగు=చెడ్డవాడు, నేరము = దోషము, ఎంచు = లెక్కపెట్టును, ఒరులు=ఇతరుల, కాంచి= చూచి చక్కిలంబు = చక్కిలమును, కాంచి=చూచి, జంతిక, నగినట్లు = నవ్వినట్లు.

తా. చెడ్డవాడు తనదగ్గఱ పెక్కు తప్పులుండఁగా చక్కిలమును గాంచి జంతిక నవ్వినట్లు, ఒరులతప్పుల నెంచును

ఆ. ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు
కాచి యతుకవచ్చుఁ గ్రమముగాను
మనసు విఱిగెనేని మఱిచేర్చరాదయా విశ్వ. 64

టీ. విశ్వ... వేమ, ఇనుము = ఇనుము, విఱిగెనేని=విఱిగినచో ఇనుమాఱు= రెండుసార్లు, ముమ్మాఱు= మూడుసార్లు కాచి, అతుక వచ్చు= అతికింపవచ్చును, క్రమముగాను, మనసు=చిత్తము, విఱిగెనేని=విఱిగినచో, మఱిచేర్చరాదయా=కుదురుపఱచలేము.

తా. ఇనుము విఱిగినచో, రెండుమూఁడు సారులు కాచి యతికించ వచ్చును గాని మనస్సు విఱిగినచో మరల కుదురుపఱచఁ జాలము

ము=హితము, చెప్పి, బడలకున్న, ఒకరిచేతి సొమ్ములు=ఇంకొకరి యొద్ద నున్న సొమ్ములు, ఊరక వచ్చునా?

తా. మంచిమాటలను చెప్పి మనస్సు రంజిల్లఁ జేయకున్నచో ఒకరి చేతిలో నున్న సొమ్ము లూరక వచ్చునా?

ఆ. కానివానిచేతఁ గాసువీసంబిచ్చి
వెంటఁ దిరుగువాఁడు వెఱ్ఱివాఁడు
పిల్లి తిన్న కోడి పిలిచిన పలుకునా విశ్వ. 68

టీ విశ్వ...వేమ, కానివానిచేత=హీనుని చేతికి, కాసువీసంబు, ఇచ్చి=ఇచ్చి, వెంట=(వాని) వెంట, తిరుగువాఁడు, వెఱ్ఱివాఁడు=అవివేకి, పిల్లి, తిన్న=తినిన, కోడి, పిలిచిన, పలుకునా=మాట్లాడునా

తా హీనుని చేతిలో డబ్బు పెట్టి వానివెంటఁ దిరుగువాఁడు వెఱ్ఱివాఁడు, పిల్లిచే దినబడిన కోడి బలుకునా?

ఆ. వానగురియకున్న వచ్చును క్షామంబు
వానగురిసెనేని వఱదపారు
వరద కఱవు రెండు వరునతో నెరుగుడి విశ్వ. 69

టీ. విశ్వ... వేమ, వానగురియకున్న=వానకురియక పోయినచో వచ్చును=వచ్చును క్షామంబు = కఱవు, వానగురిసెనేని = వానగురిసి నచో, వఱదపారు = వరదకలుగును, వఱద, కఱవు, రెండును, వరుసతో నెఱుఁగుడి = వచ్చునని యెఱుఁగుఁడు.

తా. వర్షము లేకున్న కఱవు, వర్షమున్నచో వఱద, రెండును వచ్చునని తెలియుఁడు.

ఆ. పుట్టిన జనులెల్ల భూమిలోనుండిన
బట్టునా దగ బు పట్టదెపుడు

యముని లెక్కరీతి నరుగుచునుందురు విశ్వ. 71

టీక. విశ్వ...వేమ- పుట్టినజనులెల్ల = పుట్టినవారందఱు, భూమిలో = భూమియందైన, ఉండినక = ఉన్నచో, పట్టువా, జగంబులోకము పట్టదు, ఎప్పుడు, యముని = యమధర్మరాజుయొక్క; లెక్కరీతి=లెక్క ప్రకారము; అరుగుచునుందురు = చనిపోవుచుందురు.

తా. పుట్టిన వారెల్ల భూమియందున్నచో లోకముపట్టదు. యముని లెక్క ప్రకారము అందరు పోవుచుందురు.

ఆ. వాన రాకడయును ప్రాణంబు పోకడ
కానఁబడదు దాత ఘనునికైన
కానఁబడినమీఁద కలియెట్లు నడచురా విశ్వ. 72

టీక. విశ్వ...వేమ- వానరాకడయును = వర్షము వచ్చుటయును, ప్రాణంబుపోకడ = ప్రాణముపోవుటయును, కానఁబడదు = కనుపించదు; ఎంత = ఎట్టి; ఘనునకైన = గొప్పవానికైన: కానఁబడినమీఁద = కనిపించినపిదప; కలి = కలియుగము, ఎట్లు = ఏవిధమునను, నడచురా = నడచును

ఆ. చిప్పఁబడ్డ స్వాతిచినుకు ముత్యంబాయె
నీటఁబడ్డ చినుకు నీటఁగలిసె
ప్రాప్తిగల్గుచోట ఫలమేల దప్పురా విశ్వ. 73

టీక. విశ్వ...వేమ- చిప్పఁబడ్డ = చిప్పయందుఁబడిన, స్వాతిచినుకు = స్వాతి వానచినుకు, ముత్యంబాయె (ముత్యంబు + అయె) = ముత్యంబయ్యెను; నీటఁబడ్డ = నీటియందుఁబడిన, చినుకు, నీటఁగలిసె = నీటిలోఁ గలిసెను, ప్రాప్తి = కర్మములగుట, కల్గుచోట = ఆయోగ్యస్థలమున, ఫలమేల = ఫలమెందుకు, తప్పురా = తప్పును.

తా. స్వాతివాన చినుకు చిప్పయందుఁ బడినచో ముత్యమగును. నీటఁబడినఁ గలిసిపోవును. ప్రాప్తియున్నచో ఫలమెందును దప్పును.

ఆ. ఎన్నిచోట్లు తిరిగి యేపాట్లువడినను
అంటనియ్యక శని వెంటఁదిరుగు
భూమి క్రొత్తలైన భుక్తులు క్రొత్తలా విశ్వ. 74

టీక. విశ్వ...వేమ- ఎన్నిచోట్లు = ఎన్నిస్థలములు, తిరిగి = సంచరించి, ఏపాట్లు పడినను = ఎట్టికష్టములు పడినను, అంటనియ్యక = పొందనియ్యక, శని = శని, వెంట = వెంటనే, తిరుగును, భూమి = భూమిని, క్రొత్తలైన = క్రొత్తయైన, భుక్తులు = తినుటలు, క్రొత్తలా.

తా. ఏస్థలములు తిరిగినను, ఏకష్టములుపడినను ఏమియుఁ బొందనియక శని వెన్నంటుచునేయుండును భూమిక్రొత్తలైనభుక్తి క్రొత్తదా.

ఆ. అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచమైన నదియుఁ గొదువగాదు
కొండ యద్దమందు గొంచమై యుండదా విశ్వ. 75

టీక. విశ్వ...వేమ- అనువుగానిచోట = వీలుగాని ప్రదేశమున, అధికులము = గొప్పవారమని, అనరాదు = పలుకరాదు, కొంచమైన, అదియు = అది, కొదువగాదు = కొఱతకాదు కొండ, అద్దమందు = అద్దములోన, కొంచెమై యుండదా = కొంచెముగా నుండదా.

తా. వీలుగాని స్థలమున మన మధికులమని చెప్పుకొనరాదు. కొంచెము వారమన్నను కొఱతలేదు. అద్దమందు కొండచిన్నదిగ గనపించదా.

ఆ. ఇమ్ముదప్పువేళ నెమ్మెలన్నియు మాని
కాల మొక్కరీతి గడపవలయు
విజయుఁ డిమ్ము దప్పి విరటుని గొల్వఁడా విశ్వ. 76

టీక. విశ్వ...వేమ-ఇమ్ము = స్థానము, తప్పువేళ = తప్పుసమయమున ఎమ్మెలు = విషయములు, అన్నియు, మాని = విడిచి, కాలము, ఒక్కరీతి =

ఒక్క రీతిగా, గనపవలయును = పొందవలయును, విజయుఁడు = అర్జునుఁడు, ఇమ్ము స్థానము, తప్పి = విడిచి, విరటుని = విరటరాజును, కొల్వఁగా = సేవింపఁడా.

తా. స్థానము తప్పినప్పుడు విషయము లన్నియు విడిచి కాలమును గడపవలయును. అర్జునుఁడు విరటుని కొలువలేదా.

ఆ. కర్మమానికమయిన గడచిపోవగరాదు
ధర్మరాజుఁ దెచ్చి తగని చోట
కంకుభట్టుఁ జేసెఁ గటకటా దైవంబు విశ్వ. 77

టీక. విశ్వ...వేమ- కర్మము = తాను చేసినకర్మము, అధికమయిన = ఎక్కువయైనచో, గడచిపోవగరాదు = దాటుటకు వశము కాదు, ధర్మరాజు = ధర్మరాజును, తెచ్చి, తగనిచోట = యతఁడుండదగని స్థలమున, కంకుభట్టు = కంకుభట్టుగా, దైవంబు = దేవుఁడు, కటకటా = అయ్యయో, జేసెన్ = చేసెను.

తా. కర్మమును నెవ్వరు గడుపజాలరు అంతటివాఁడైన ధర్మరాజును దైవము కంకుభట్టుగఁ జేసి విరటుని గొలిపించినాడు.

ఆ. లక్ష్మియేలినట్టి లంకాధిపతిపురి
పిల్లకోతి పౌఁజు కొల్లపెట్టె
చేటుకాలమయినఁ జెరుప నల్పుఁడె చాలు విశ్వ. 78

టీక. విశ్వ...వేమ- లక్ష్మి = లక్ష్మీదేవి, ఏలినట్టి = పరిపాలించిన, లంకాధిపతిపురి = రావణుని పురమగు లంక, పిల్లకోతిపౌఁజు = చిన్న కోతుల గుంపు, కొల్లపెట్టె = దోచెను. చేటుకాలమున = వినాశమగు కాలమువచ్చినచో, జెరుప = చెరుచుటకు, అల్పుఁడే = చిన్నవాఁడే, చాలు

తా. లక్ష్మియేలిన లంకను పిల్లకోతులగుంపు కొల్లగొట్టెను. కాలము సరిగాలేనిచో ఎంతబలాఢ్యుని నైనను వంచుటకు అల్పుఁడే చాలును.

ఆ. చిక్కియున్న వేళ సింహంబునైనను
బక్కకుక్క కఱచి బాధచేయు
బలిమిలేనివేళఁ బంతంబు చెల్లదు విశ్వ. 79

టీక. విశ్వ...వేమ- చిక్కియున్నవేళ = బలముతగ్గియున్న సమయమున, సింహంబునైనను = సింహమునైనను, బక్కకుక్క, కఱచి బాధచేయు = బాధకలిగించును, బలిమి = బలము, లేనివేళ = లేనప్పుడు, పంతము, చెల్లదు = సాగదు.

తా. బలము లేనప్పుడు సింహమునైనను బక్కకుక్క కఱచి, బాధకలిగించును బలములేనప్పుడు పంతము చెల్లదు.

ఆ. మొదటనాశబెట్టి తుదిలేదు పొమ్మను
పరమలోభులైన పాపులకును
ఉసురు తప్పకుండు నుండేలు దెబ్బగా విశ్వ. 80

టీక విశ్వ...వేమ- మొదట = తొలుత, ఆశపెట్టి = ఆశకలిగించి తుది = చివరకు, లేదు. పొమ్మను = బొమ్మను, పరమలోభులైన=మిక్కిలి లోభులైన, పాపులకును = పాపాత్ములకును, ఉసురు = ఉసురు,తప్పక = తప్పకుండ, ఉండేలుదెబ్బగా=ఉండేలుదెబ్బవిధమున; అంటు=అంటును,

తా. మొదట నాశపెట్టిన పిమ్మట లేదను లోభుల కుసురు ఉండే లుదెబ్బగా తగిలి తీరును.

ఆ. ఇచ్చువాని యొద్ద నీయనివాఁడున్నఁ
జచ్చుగాని యీవి సాగనీడు
కల్పతరువుక్రింద గచ్చ పొదున్నట్లు విశ్వ. 81

టీక. విశ్వ...వేమ- ఇచ్చువానియొద్ద = దానము సేయువానియొద్ద ఈయనివాఁడు = లోభి; ఉన్న = ఉండిన; చచ్చుగాని = చచ్చునుగాని;

ఈవి=ఇచ్చుట, సాగనీదు = చేయనీయదు; కల్పతరువుక్రింద=కల్పవృక్షము క్రింద, గచ్చపొద, ఉన్నట్లు.

తా. కల్పవృక్షముక్రింద గచ్చపొద యున్నట్లు; ధర్మవంతుని దగ్గఱ లోభియున్నచో ధర్మము చేయనీయదు.

ఆ. అరయ నాస్తియనక యడ్డుమాటాడక
తట్టువడక మదిని దన్నుకోక
తనది గాదనుకొని తా బెట్టునదె పెట్టు విశ్వ. 82

టీక. విశ్వ...వేమ- అరయ = అరయఁగా, నాస్తియనక=లేదనక, అడ్డుమాటాడక = అడ్డుచెప్పక, తట్టువడక = తొట్రుపాటుపడక, మదిని=మనస్సులో, తన్నుకోక; తనది; కాదనుకొని = కాదనియెంచి. తా = తాను, పెట్టునదె = ఇచ్చునదె, పెట్టు = ఈవి.

తా. లేదనకుండ తొట్రుపాటుపడక, మనస్సులో తన్నుకోక ఉన్నది తనది కాదనుకొని, పెట్టినపెట్టే పెట్టు.

ఆ. ధనముకూడఁబెట్టి దానంబు చేయక
తాను దినక లెస్స దాఁచుగాక
తేనెటీగకూర్చి తెరువరికియ్యదా విశ్వ. 83

టీక. విశ్వ...వేమ- ధనమా = ద్రవ్యము, కూడఁబెట్టి=జాగ్రత్తచేసి దానంబుచేయక = దానముచేయక, తాను, తినక = తినకుండ, లెస్స=ఎక్కువగా, దాచుఁగాక = దాచుఁగాని, తేనెటీగ, కూర్చి = దాచి, తెరువరికి=బాటసారికి, ఇయ్యదా.

తా. లోభి ధనముగూడఁబెట్టి దానము సేయక, తాను దినక దాచును. అయ్యది తేనెటీగ తేనెను జేర్చి తెరువరికిచ్చినట్లగును.

ఆ. కొంకణంబుపోవ గుఱ్ఱసింహముకాదు
కాశికరుగ బంది గజముగాదు
చేటుజాతినాఁడు విప్రుండు కాలేడు విశ్వ. 84

టీ. విశ్వ... వేమ, కొంకణంబు = కొంకణంబునకు, పోవఁగా = పోయిన, కుక్క, సింహముగాను = మృగరాజుగాను, కాశికి = కాశికి. అరుగఁగా = అరిగిన, పంది, గజము = ఏనుగ, కాదు. నీచజాతివాఁడు = ఇతర కులమువాఁడు, విప్రుండు = బ్రాహ్మణుఁడు, కాలేడు = కానేరఁడు.

తా. కొంకణమునకుఁ బోయినను కుక్క సింహముగా లేనట్లును కాశికిఁబోయినను పంది ఏనుఁగు కానట్లును, ఇతర కులమువాఁడు బ్రాహ్మణుఁడు కానేరడు.

ఆ. తవిటి కరయఁబోవ దండులంబుల గంప
శ్వానమాక్రమించు సామ్యముగను
వైశ్యవరుని సొమ్ము వసుధనీచుల కబ్బు విశ్వ. 87

టీ. విశ్వ...వేమ, తవిటికి = తవుడును, అరయ = చూచుటకు, పోవ = పోవఁగా, తండులంబులగంప = బియ్యపుగంప, శ్వానము = కుక్క, ఆక్రమించు = వశము చేసికొను, సామ్యముగను = విధముగా, వైశ్యవరుని సొమ్ము = కోమటిధనము, వసుధ = భూమియందు, నీచులకు = హీనులకు, అబ్బు = లభించును.

తా. తవిటికిఁబోవ బియ్యపుగంప శ్వాన మాక్రమించినట్లు కోమటి సొమ్ము నీచులకు లభించును.

ఆ. దాతకాని వాని దరుచుగా వేఁడిన
వాఁడు దాతయౌనె వసుధలోన
అవురు దర్భయౌనె యబ్ధిలో ముంచిన విశ్వ. 88

టీక. విశ్వ...వేమ- దాతకానివాని = దానముసేయని వానిని, తరుచుగా = అప్పుడప్పుడు, వేఁడిన = వేఁడికొన్నచో, వాఁడు = అతఁడు, దాతయౌనె = దాతయగునా, వసుధలోన, అవురుగడ్డి, అబ్ధిలో = సముద్రములో, ముంచిన = ముంచినను, దర్భయౌనె = దర్భయగునా.

తా. దాతకాని వానిని లేఱుచు నడిగినను దాతకాడు. అవురుగడ్డి సముద్రములో ముంచిన మాత్రమున దర్భయగునా.

తే. పరగ జాతిగుండు పగులఁగొట్టఁగవచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరిగింపఁగారాదు విశ్వ. 89

టీక. విశ్వ — వేమ - పఱగ = ఒప్పుగా, జాతిగుండు = జాతిగుండును, పగులఁగొట్టఁగవచ్చు = పగులఁగొట్టవచ్చును. కొండలన్ని = కొండలన్నిటిని; పిండిగొట్టవచ్చు = పిండిగాచేయవచ్చును, కఠినచిత్తుమనసు = కఠినచిత్తుని యొక్క మనస్సు, కరగింపగారాదు = కరగింపజాలము.

తా. జాతిగుండను పగులగొట్టవచ్చును. కొండలను పిండిసేయవచ్చును. కఠినుని మనస్సుమాత్రము కఱగింపఁబడదు.

ఆ. వంపుకఱ్ఱ కాల్చి వంపు దీర్పఁగవచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరగింపఁగారాదు విశ్వ. 90

టీ. విశ్వ — వేమ, వంపుకఱ్ఱ = వంకరగానున్న కఱ్ఱను, కాల్చి, వంపు = వంకర. తీర్పవచ్చును = పోగొట్టవచ్చును, కొండలన్ని పిండిగొట్టవచ్చు, కఠినచిత్తుమనసు కరగింపఁగారాదు.

తా. కాల్చి కఱ్ఱనున్న వంకరదీర్పవచ్చును. గొండలను పిండిచేయవచ్చును. కాని కఠినునిమనస్సు కరగింపలేము.

ఆ. విత్తము గలవాని వీపు పుండైనను
వసుధలోనఁ జాల వార్తకెక్కు
బేదవానియింటఁ బెండ్లైన నెఱుఁగరు విశ్వ. 91

టీ. విశ్వ — వేమ, విత్తముగలవాని = ధనవంతుని, వీపు = వీపు పైన పుండైన = కురుపులేచినచో, వసుధలోన = భూమిలోన, చాల =

ఎక్కువగా, వార్త = వార్తకు, ఎక్కు = బయలుదేరును, పేదవానియిం
ట = పేదవానియింటిలో, పెండ్లయిన = పెళ్ళియైనను, ఎఱుఁగరు.

తా. గొప్పవాని వీపుమీఁద కురుపులేచినచో యావార్త జగమెల్లఁ బ్రాకును. పేదవానియింట పెళ్ళియైనను ఎవ్వరు చెప్పుకొనరు.

ఆ. ఆపదగల వేళ నరసి బంధులఁజూడు
భయము వేళజూడు బంటుతనము
పేదవేళజూడు పెండ్లాము గుణమును విశ్వ. 92

టీక. విశ్వ...వేమ- ఆపదగలవేళ =ఆపదవచ్చినవేళ, అరసి,బంధుల = బంధువుల, చూడు = చూడుము, భయమువేళ = భయపడినప్పుడు, చూడు = చూడుము, బంటుతనము, పేదవేళ = దరిద్రము వచ్చినప్పుడు; చూడు, పెండ్లాము గుణము = భార్య గుణము.

తా. ఆపదవేళ బంధువులను జూడుము. భయపడినప్పుడు బంటుతనము చూడుము. దరిద్రము వచ్చినప్పుడు భార్యగుణము చూడుము.

ఆ. ఆలిమాటలువిని యన్నదమ్ములఁబాసి
వేఱైపోవువాఁడు వెఱ్ఱివాఁడు
కుక్కతోకబట్టి గోదావరీదునా విశ్వ. 93

టీక.విశ్వ...వేమ- ఆలిమాటలు = భార్యమాటలు, విని=ఆలకించి, యన్నదమ్ముల = అన్నదమ్ములను, పాసి = విడిచి,వేఱై = వేఱై, పోవువాఁడు = అరుగువాఁడు, వెఱ్ఱివాఁడు = అవివేకి, కుక్కతోక = కుక్కతోక, పట్టి = పట్టుకొనిన, గోదావరి = గోదావరి, ఈదునా?

తా. భార్యమాటలు విని వేఱుపోవువాఁడు వెఱ్ఱివాఁడు. కుక్కతోక బట్టుకొన్న గోదావరి యీదునా.

ఆ. మగని కాలమందు మగువ కష్టించిన
సుత్తుల కాలమందు సుఖమునందు
కలిమి లేమి రెండు గల వెంతవారికి విశ్వ. 94

టీ. విశ్వ...వేమ, మగనికాలమందు = భర్తయున్నప్పుడు, మగువ = ఆడుది, కష్టించిన = కష్టపడిన, సుతుల కాలమందు = కొడుకుల కాలములో, సుఖమునందు = సౌఖ్యము బొందును, కలిమి = సంపద, లేమి = దరిద్రము, రెండు, కలవు = ఉన్నవి. ఎంతవారికి = ఎట్టివారికైనను,

తా. స్త్రీ మగనికాలములో కష్టబడినచో, సుతుల కాలమున సౌఖ్యములఁ బొందును, కలిమిలేము లెట్టివారికైనను నున్నవి.

ఆ. చెప్పులోనిరాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు నింతంతగాదయా విశ్వ. 95

టీ. విశ్వ...వేమ, చెప్పులోనిరాయి = చెప్పులోపలనుండు రాయి, చెవిలోని జోరీగ = చెవియందు జేరు-ఈగ, కంటిలోని నలుసు = కంటిలోబడు నలుసు; కాలిముల్లు = కాలునందు ముల్లు, ఇంటిలోనిపోరు = ఇంటిలో గలహము, ఇంతంతగాదయా = ఇట్లుండునని చెప్పలేము.

తా. చెప్పులో రాయి, చెవిలో ఈగ, కంటిలో నలుసు, కాలిలో ముల్లు, ఇంటిలో కలహము కడు బాధ కలిగించును.

ఆ. తల్లిదండ్రులపయి దయలేని పుత్రుండు
పుట్టనేమి వాఁడు గిట్టనేమి
యింటబుట్టి పెరిగి యిల్లాలి బంటురా విశ్వ. 96

టీ. విశ్వ...వేమ, తల్లిదండ్రులపయి = తల్లిదండ్రులమీద, దయలేని పుత్రుండు = దయలేనికొడుకు, పుట్టనేమి = పుట్టిననేమి, గిట్టనేమి = చచ్చిననేమి, యింట = ఇంటియందు, పుట్టి, పెరిగి = పెద్దవాఁడై, ఇల్లాలిబంటురా = భార్యకుబంటు

తా. తలిదండ్రులపయిన దయలేని కొడుకుపుట్టిననేమి! చచ్చిననేమి! వాఁడు భార్యకు బంటు.

ఆ. తనకు లేనినాఁడు దైవంబు దూఱును
దనకుఁ గల్గెనేని దైవమేల
తనకు దైవమునకు దగులాట మెట్టిదో విశ్వ. 97

టీ. విశ్వ...వేమ, తనకు = తనకు, లేనినాఁడు = ఏమియు లేని దినము, దైవంబు = దైవమును, దూఱును = తిట్టును, తనకు, గల్గెనేని = ఉన్నచో, దైవమేల = దేవుఁడేల, తనకు = తనకు, దైవమునకు, దగులాట మెట్టిదో = తగులాటమేమో.

తా. లేనప్పుడు దేవుని దూఱును. ఉన్నప్పుడు దైవమేల. దైవమునకు నతనికి సంబంధమేమిటి.

ఆ. మాటలాడ నొక్కటి మనసులో నొక్కటి
ఒడలిగుణము వేఱె యోజ వేఱె
ఎట్లు గల్గు ముక్తి యీలాగు తానుండ విశ్వ. 98

టీ. విశ్వ...వేమ; మాటలాడనొక్కటి = పలుకుటొక విధము, మనసులో నొక్కటి = మనస్సులో మఱియొక విధము, ఒడలిగుణము = శరీరగుణము వేఱె = మఱియొక తీరు, యోజవేఱె = ఆలోచన వేఱు, ఎట్లు = ఏతీరున, కల్గు = కలుగును, ముక్తి = మోక్షము, ఈలాగు = యీతీరున, తానుండ = తానుండగా.

తా. మాటయొకటి; మనసొకటి, గుణమొకటి; ఆలోచనయింకొకటిగా నుండువానికి ముక్తి యెట్లు కలుగును!

ఆ. అంతరంగమందు నపరాధములు చేసి
మంచివాని వలెను మనుజుఁడుండు;
ఇతరు లెఱుఁగకున్న నీశ్వరుఁ డెఱుఁగఁడా విశ్వ. 99

టీ. విశ్వ...వేమ, అంతరంగమందు = మనస్సునందు; అపరాధములు = దోషములు, చేసి = కావించి, వంచివానివలెనే = మంచివానిరీతినే

ఆ. ఓగునోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చుఁ బరమలుబ్ధు
పంది బురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా విశ్వ. 102

టీ. విశ్వ...వేమ-ఓగున్ = పనికిమాలినవానిని, ఓగు= పనికిమాలిన వాడు (మూర్ఖుడు) మెచ్చున్ = మెచ్చుకొనును, ఒనరంగన్ = తగునట్లుగా పరమలుబ్ధు = మిగుల లోభియగువాడు. అజ్ఞానిన్ = జ్ఞానము లేనివానిని, భావమిచ్చి = హృదయమిచ్చి (మనస్సు) మెచ్చున్ = మెచ్చుకొనును, పంది = వరాహము, బురదన్ = బాడిని, మెచ్చుకొనును.— మెచ్చుకొనును గాని, పన్నీరుఁ = పన్నీటిని, మెచ్చునా = మెచ్చుకొనునా ? (మెచ్చుకొనదనుట)

తా. మంచి పెద్దలను మూర్ఖుడు తెలిసికొననట్లు లుబ్ధుడు పండితుల నెఱుఁగఁ జాలఁడు.

ఆ. గాజు కుప్పెలోనఁ గడగుచు దీపంబ
దెట్టులుండు జ్ఞాన మట్టులుండుఁ
దెలిసినట్టివారి దేహంబులందును విశ్వ. 103

టీ. విశ్వ...వేమ.. గాజు కుప్పెలోనన్ = గాజుబుడ్డియందు, దీపంబు అది = ఆదీపము, కడగుచున్ = ప్రకాశించుచు, ఎట్టులుండునొ = ఏవిధముగాఁ బ్రకాశించుచుండునో అట్టులు = ఆవిధమున, జ్ఞానము = తెలివి. తెలిసినట్టివారి = జ్ఞానవంతులయొక్క, దేహంబులందును = శరీరములయందును, ఉండున్ = ఉండును.

తా. గాజుబుడ్డి యందలి దీపమే నిశ్చలముగాఁ జలింపక ప్రకాశించుచుండునో అవిధముగానే జ్ఞానుల మనస్సు చలనములేక యుండును.

ఆ. ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండుఁ
జూడఁ జూడ రుచుల జాడ వేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా విశ్వ. 104

టీక. విశ్వ... వేమ- చూడఁ జూడఁ = బాగుగ జూచినయెడల. ఉప్పు = లవణమును, కప్పురంబు = కర్పూరమును, ఒక్కపోలికఁ = ఒకరీతిగానే, ఉండుఁ = ఉండును. (అవగాఁగనఁబడుననుట) రుచులజాడ = రుచుల విధము; వేఱు = ఒకటికాదు, పురుషులందుఁ = మనుష్యులలో. పుణ్యపురుషులు = పుణ్యాత్ములు, వేఱయా = ఒక్కవిధముగానుండరు.

తా. చూపులకు, ఉప్పును గప్పురము నొక విధమగు వర్ణము కలిగియుండియు రుచులు భేదముగా నుండునట్లు మనుష్యులలో సుజన దుర్జన భేదవట్లుగా నుండును.

ఆ. అంకెఁ దెలిసి మాటలాడ నేర్చినపుడె
పిన్న పెద్ద తనము లెన్న నేల?
పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుఁగదా విశ్వ. 105

టీక విశ్వ... వేమ- అంకెఁదెలిసి = సాధకబాధకములఁ దెలిసికొని, మాటలు, ఆడఁ = పలుకఁగా, నేర్చినపుడె = నేర్చిన కాలమందు. పిన్న = చిన్నవాఁడు పెద్దతనములు = పెద్దచిన్న అనుతారతమ్యమును, ఎన్ననేల = ఆలోచింపఁగూడదు; పిన్నచేతి దివ్వె = పసివాని చేతిలోని దీపము, పెద్దగా = పెద్దదిగా, వెలుఁగదా = ప్రకాశింపదా (ప్రకాశించును)

తా. ఒకపనియందు సాధకబాధకములు తెలిసినవాఁడయిన యెడల పసివాఁడైనను అతనిమాటను విశ్వసింపవలెను. జ్ఞానము లేకున్న యెడల పెద్దవాడయినను, అతని మాటను విశ్వసింపరాదు;

ఆ. పసగురాడు మాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁడాడు మాట యెక్కదెందు
ఊరకుండువాని కూరెల్ల నోపదు విశ్వ. 106

టీక. విశ్వ... వేమ- పసగురు = పలువురు, ఆడుమాట = చెప్పినట్టి మాట, పాటియై = న్యాయము కలదియై, ధరఁ = భూమియందు, జెల్లున్ = ఒప్పును, ఒకడు, ఆడుమాట = చెప్పునట్టిమాట, ఎందుఁ = ఎక్కడను, ఎక్కదు = సమ్మతింపఁబడదు; ఊరకుండువానికిఁ = ఏమియు

[illegible]టాడక యుండు వాతనితో, ఊరెల్లకు = గ్రామమందలి జనులసము [illegible]దాయమంతయు, ఓపదు = సరికాదు.

తా. పలువురు చెప్పుమాట తప్పయినను సరియని మనుష్యులు ఇష్ట పడుదురు కాని ఒక్కడు నిజముపలికినను ప్రజలామాట నొప్పుకొనరు, కాబట్టి తెలివికలవాఁడు దానిని తెలిసికొని యూరకుండుటమంచిది.

ఆ. ధార్మికునకుఁ గాని ధర్మంబుగనరాదు
కష్టజీవికెట్లు గానబడును
నీరు చొరక లోతు నిజముగాఁ దెలియదు విశ్వ. 107

టీక. విశ్వ...వేమ- ధార్మికునకుఁగాని = ధర్మాత్మునకుఁ దప్ప (ఇతరులకు) ధర్మంబు, కానరాదు = తెలిసికొన శక్యముగాదు. కష్టజీవికిన్ = కష్టించి జీవించువానికి, ఎట్లు = ఏవిధముగా, కానఁబడును = కానవచ్చును. నీరు = నీటియందు, చొరక = దిగక, లోతు = ఆనీటి గంభీరత, నిజముగాన్ = సత్యముగా, తెలియదు.

తా. నీటియందు దిగకుండ నానీటి లోతుఁ దెలిసికొనఁ జాలని విధమున ధర్మబుద్ధిగలవాఁడుగాని సూక్ష్మమును తెలిసికొనఁ జాలఁడు.

ఆ. అన్నమడుగ నతని కన్నంబుఁ బెట్టిన
బాలువేయుదాన ఫలితమేమి
ధనికునకు నొసఁగు దానంబులటువలె విశ్వ. 108

టీక. విశ్వ...వేమ- అన్నము = భోజనము, అడుగని = కావలయునని కోరని, అతనికిన్ = వానికి, అన్నంబు, బెట్టినన్ = బెట్టినచో, పాలు వేయుట = అన్నమునదినక పాలువేయుట, దానన్ = అట్లుపాలువేసినందు వలన, ఫలితము + ఏమి = ఏమిప్రయోజనము, ధనికునకున్ = ధనముగలవానికి [illegible]సఁగు దానంబులు = ఇచ్చుదానంబులు, అటువలెన్ = అట్లే (వ్యర్థమనుట)

తా. ధనముగలవానికి దానమిచ్చుట, ఆకలిలేనివానికిఅన్నము పెట్టి [illegible] వ్యర్థయగును.

---

శ్రీ లక్ష్మీవిలాస ప్రెస్, బెజవాడ.

# మా స్వంత ప్రచురణ స్కూల్ పుస్తకములు

1 భాస్కర శతకము టీక...... (అప్రూవ్డ్) 0-4-0
2 దాశరథీశతకము టీక...... (అప్రూవ్డ్) 0-4-0
3 కుమారీ శతకము సటీక 0-2-0
4 బాలరామాయణము సటీక (అప్రూవ్డ్) 0-2-0
5 కుచేలోపాఖ్యానము టీక...... (అప్రూవ్డ్) 0-4-0
6 రుక్మిణీకళ్యాణము టీకా పాదాబయిండు (అప్రూవ్డ్) 0-6-0
7 డిటో క్యాలికో బయిండు 0-8-0
8 గజేంద్రమోక్షము పాదాబయిండు (అప్రూవ్డ్) 0-6-0
9 డిటో క్యాలికో బయిండు 0-8-0
10 ప్రహ్లాద చరిత్ర టీక సప్తమస్కంధము మూలం. 0.6.0
11 నవీన గోదావరిజిల్లా భూగోళం...(అప్రూవ్డ్) 0-4-0
12 కృష్ణాజిల్లా భూగోళం by N.S. Somayajulu, B A, L. T. 0-4-0
13 నవీన గుంటూరుజిల్లా భూగోళం 0-4-0
14 పంచతంత్రము ......... (అప్రూవ్డ్) 0-8-0
15 నీతిచంద్రిక పరవస్తు చిన్నయ్యసూరి కృతం (అప్రూవ్డ్) 0-8-0
13 బాలధ్రువచరిత్ర 3, 4, 5, తరగతులకు (అప్రూవ్డ్) 0-3 0
17 బాలకుశలవచరిత్ర 4, 5, 6, తరగతులకు (అప్రూవ్డ్) 0-5-0
18 రామాయణ నీతికథలు 4, 5, 6, తరగతులకు... 0-6-0
19 భాగవత నీతికథలు 1, 2, 3, ఫారములకు 0-10-0
20 భారత నీతికథలు మొదటి భాగము బొమ్మలతో (అప్రూవ్డ్) 0-6-0
21 భారతనీతి కథలు రెండవ భాగము బొమ్మలతో (అప్రూవ్డ్) 0-6-0
22 సుమతీశతకము టీకా తాత్పర్యము (అప్రూవ్డ్) 0 2-

అన్ని రకముల అన్ని క్లాసుల పుస్తకములు ఇతర రకములు మావద్ద [illegible]

[illegible]:- మారుతీరాం కంపెనీ బెజవాడ.